# తొలిపలుకు

నేను గొన్ని యేండ్ల క్రింద శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతమగు హర్షచరితము నింటరుమీడియటు విద్యార్థులకుఁ బాఠము చెప్పవలసివచ్చెను. అప్పుడందు బాణుఁడు హర్షచక్రవర్తిని దర్శించిన తెఱంగెంతయు నాహృదయము నాకర్షించెను. అప్పటి నుండియునది వస్తువుగా గ్రహించియొక చిన్నకావ్యము వ్రాయవలెనని యెంచుచుంటిని. అట్లుచేయుటకు మొన్నకడచిన వేసంగిలోఁ గొంత యవకాశము లభించెను. అది పురస్కరించుకొని యొకపక్షము దినములలో నిది వ్రాసి ముగించితిని. ఏతద్రచనమున బాణుని హర్షచరిత్రమందలి కథను, భావములను గూడఁ జాలమట్టుకు గ్రహించితిని. కథావిస్తృతికై కొంతభాగము కల్పించితిని. సహృదయులిందలి గుణములు గ్రహించి దోషములు మన్నింతురు గాక యని ప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త

శ్రీ

కృతిపతి వంశవర్ణన నక్షత్రమాలిక.

కలఁడు కద కాంతిధిక్కృత కమలహితుఁడు
సకల బృందారకార్చిత చరణయుగుఁడు
నిజతపో నఖదారిత నిఖిలదురిత
హస్తి, కాశ్యపమౌని హార్యతువిభుఁడు. 1

ఆతని యన్వయంబున శి
వాంఘ్రి సరోజ సదార్చనాపరుల్
పూతచరిత్రు లార్జన స
ముజ్జ్వల చిత్తులు దానధర్మ క
ర్మాతతకీర్తి సౌరభ స
మావృత సర్వ దిగంతరుల్ కృపా
న్వితులు, సాధులెందఱొ జ
నించిరి వంశవివృద్ధిహేతులై. 2

వారలలోఁ దపోమహిమ
భాసితు, వర్ధిత వంశకీర్తి వి
స్తారుని, శాంకరాగమ క
థాపరిశీలన లగ్నమానసాం
భోరుహు, జోగమాహృదయ
మోహనమూర్తిని బేరరాజు బం
గారయ నామవిశ్రుతు న
ఖండ యశస్కునిఁ జేర్కొనన్వలెన్. 4

వాసలు లేక పల్లెలును
బట్టణముల్ కలగుండు చెందఁగా
భూనుతకీర్తి యా ఘనుఁడు
పుణ్యగిరీంద్ర శిరంబుపైఁ దపో
ధ్యాననిరంతర ప్రవణుఁ
డై యచలాత్మతనుండి రాఁ దద
ధ్యానుగతంబులై కురిసె
నంబుధరంబులు కుండపోఁతగన్.

ఆమహనీయమూర్తికి గు
ణాలయ జోగమయందుఁ బేరరా
జ్ఞాముఁడు. రామమూర్తి, కరు
ణామయచిత్తుఁడు సుబ్బరావునన్
ధీమహితుల్ కుమారులు జ
నించిరి శీతగిరీంద్రకన్యకా
కాముక పాదపంకజ యు
గప్రకటప్రవణాత్మ బంభరుల్.

అందుఁ బేర్రాజు సాల్టుశాఖాధికారి
పదవిని వహించి కీర్తి సంపదగడించె
రామమూర్తియు సబురిజిస్ట్రారుఁ డగుచుఁ
బిదపఁ దహసీలుదారుఁడై పేరుగాంచె.

కనియెను రామమూర్తి గుణ
గణ్యుఁడు సూరమనున్ పతివ్రతా
గణమణియందుఁ బద్మజు మొ
గంబులో వేదము నాల్గు మూర్తులో

యనఁదగు నల్వు రాత్మజుల
నార్యనిఁ బేరవిభున్, సదాశివున్,
ఘనుఁడగు మల్లికార్జును, వి
కస్వరకీర్తిని రామమూర్తినిన్. 7

అధ్వనిర్మాణ శాఖాంతరోద్యోగియై
గౌరవం బార్జించెఁ బేరరాజు
శశ్వచ్ఛివాంఘ్రి కంజాత లగ్నాత్ముఁడై
ధన్యత్వ మందె సదాశివుండు
ఆంగ్లసారస్వ తాధ్యాపకత్వము చెంది
యశమాచికొనె మల్లికార్జునుండు
పాఠశాలావళీపరిదర్శియై మేటి
ప్రఖ్యాతి గడియించె రామమూర్తి
వారిలో నగ్రసంభూతుఁ బేరరాజు
బెండపూడికులాంభోధి విమలరాజుఁ
బేరరాడభిధానుండు పెద్దతండ్రి
జనకు నానతిచేత దత్తునిగఁ గొనియె. 8

సంతత దేవతార్చనల
సజ్జనసేవల సత్పురాణశా
స్త్రాంతరవస్తుచింతనల
నాత్మవివేచనలన్ దురాపయో
గాంతిమసిద్ధిసాధనల
నాయనఘాత్ముని తల్లి రత్నమాం
బాంత యనంతపుణ్యపు ని
కాయము ప్రోవిడె వంశవృద్ధికై. 9

రత్నము పుణ్యకాంతల ప
రంపర రత్నమ యాఁ దదాత్మభూ
రత్నము తల్లిదండ్రుల పు
రాకృత పుణ్యము పంట యాహిత
ప్రత్నకులాఖిలాచరణ
బంధురుఁ డన్వహశంక రార్చనా
యత్న పరాయణాత్ముఁ డల
ఘారు నుదారుఁడు వీరరాజునున్. 10

శివచరణాంబు జాతయుగ
సేవ నిరంతర సత్పురాణవా
జ్నివహమహార్థసంగ్రహణ
నిష్ఠఁ బరోపకృతి ప్రవీణతన్
బవళులు రేలు పుచ్చుచు ఘృ
ణామయుఁ డాతఁడు షష్టివత్సరో
త్సవమొనరెఁ సమస్తహిత
సంతతి నేత్రమనోహరంబుగన్. 11

పాతివ్రత్యము కొన్నరూపు గుణసం
పజ్జన్మగేహంబు, ధీ
నీతిక్షాంతి దయాలవాలము భవా
నీపాదపూజోత్సవ
ప్రీతిస్ఫీతమనస్క నన్వయనిధిన్
బెండ్లాడె నాధన్యుఁ డ
జ్ఞాతాఘుం డల పద్మఁబోలెఁ గనకాం
బాభామినీ రత్నమున్. 12

వంకలులేని చందనపుఁ
బంతులకున్ నడుమన్ దృతీయదృక్
శంకగా నంగఁ జేయుతిల
కంబు ధరించెడు నాయనన్ దదీ
యాంకధరాస్థితం గనక
మాంబను జూడఁ బురాణదంపతుల్
శంకరపార్వతుల్ భువి నె
సంగినయట్టులు నేత్రపర్వమౌ. 13

విద్వత్సహృన్మనోఽభీష్ట సిద్ధి క్షేత్ర
మై రహించెడి మేటి పేరరాజు
వినయవిజ్ఞాన సంవిత్పూర్ణమానసుం
డై విరాజిల్లు సన్యాసిరాజు
సకలలౌకిక కార్య సంవిధానసమర్థుఁ
డై మించు ఘనకీర్తి రామమూర్తి
విద్యద్విషయ మహావిజ్ఞానభాసితుఁ
డై దయివారు ప్రసాదరావు
హితమనఃప్రీతికరుఁడు సర్వేశ్వరుండు
సుగుణవిజ్ఞానములతావు సుబ్బరావు
మఱియు ముప్వురు కూఁతుండ్రు మాన్యచరిత
ధన్య లుద్భవమందిరా దంపతులకు. 14

భూమితలావతీర్ణ మయి
పొల్పెసలారు నపూర్వసందనా
రామము వారికుక్షి, యట
రాజిలుఁ గల్పమహీజముల్ జన

స్తోమముపాలి పెన్నిధులు
తుష్టికరమ్ము లనాథపాళికిన్
శ్రీమహితమ్ము తత్తపము
చెందిన సిద్ధికి మాఱురూపముల్. 15

వారలలోనఁ బూర్వజుఁడు
వంశము పెద్దలొనర్చినట్టి వి
స్తారతపమ్ముపంట, బుధ
సంతతి కల్పమహీరుహమ్ము, వి
ద్యారతుఁ డాశ్రితావనవ
హావ్రత దీక్షితుఁ డొప్పఁ బేరరా
జౌరిమి, దాన, మార్జవము
నొందిన పౌరుషమూర్తియో యనన్. 16

అమలిన భక్తిపూర్ణులయి
యన్నవచస్సు యథాక్షరమ్ముగా
నమరుచుటందు మారుతికి
నాతని తమ్ముల కీడుజోడులై
సుమధురశీల శాలు లను
జుల్ నిరంతఁబును గొల్వఁ బేరరా
జమరెడి భూరివైభవము
హాత్త్వము పేర్మి సజాతశ్రేష్ఠుఁడై. 17

వినయము భూరిసంపద, వి
వేకము గర్వములేమి, దీనర
క్షణపరతంత్రబుద్ధి యవి
కత్థనభావము, దానరక్తిదూ

షణము విరక్తి, మోక్షకర
సాధనసక్తి యిహార్థభుక్తి యుక్
గానములు పేరరాజుఁ బ్రతి
కూలతఁ జూపి సమాశ్రయించెడిన్. 18

ఊరనుండుచు చాలు దారుణామయపీడి
తునిఁగూడ ధైర్యమ్ముఁ గొనఁగఁ జేత
యింటికేతెంచుట యిరవుకొన్నామమం
బడలిసామికి సామి యడఁగిచనుట
చేసేఁతఁగొనుట చొచ్చిన రోగ వికృతికి
గుప్తరీతిగ వీడుకో లొసఁగుట
యగదమిచ్చుట రోగి యఖిల దేహావృత
వ్యాధి నిశ్శేషమై పరుగులిడుట
యని భిషజ్మణి పేరరాజును గుఱించి
చచ్చిబ్రదికిన యుల్లాఘుజనవిసరము
తారకాణలుగా వారి వీరి పేరు
లొప్పఁజెప్పుచు నిచ్చలుఁ జెప్పుకొంద్రు. 19

కవులును బండితాళి రసి
కప్రవరుండని, యర్థిసంతతుల్
దివిషదనోకహంబని, కు
లీనులు యోగ్యుఁడటంచు, బందుగుల్
నవనిధియంచు, మిత్రులు క
లప్రియభాషియటంచు, రోగవ
న్నివహము సిద్ధహస్తుఁడని
నిత్యము చేరెడిఁ బేరభూపతిన్. 20

అలరామయ్యాడు విదేహరాజసుతనఁ
బ్లౌరాజు చాగంటి వం
శలలామంబయి పేరుగన్న శరభే
శప్రాజ్ఞకూఁతుర్ దయా
శ్రీలసన్మంగళవార్ధి, సచ్చరిత, గౌ
రీకాంతనుద్యాన్వ్యాహ్వయా
కులదీపమ్ముల సాధులం గొడుకులం
గూఁతుం ద్రసనుం గాంచెడిన్. 21

శ్రీనివహానహమ్ములు వి
శిష్టతరమ్ములు నైన పున్నెముల్
నే నెఱి తొంటి పుట్టువున
నిశ్చలబుద్ధి నొనర్చి యుంటినో
భూనుతకీర్తి బెండపుడి
పూజ్య కులార్ణవ పూర్ణిమాసుధా
భానుఁడు పేరరాజు సహ
వాసపు సంపద యానవిల్లఁగన్. 22

క్షేమార్వీగృహ జాతరూపవసనా
దిప్రాజ్యదానంబు లీ
క్షోణిం దొల్లిటినాఁటినుండియును గ
ల్గున్ వాని నీనేర్చినా
రానందంబునఁ బల్వు రిద్ధచరితుల్
ప్రాణంబు దానంబు లే
నేనాఁడు న్వినఁనాఁతఁడొక్కఁ నికె య
య్యేం దద్వదాన్యప్రథల్. 23

పన్నిస యామయవ్యథలు
పాపె, నెదెప్పుడు చెప్పుకొన్న నా
విన్నపమాలకించె, విని
పీనుల విందుగ నా కవిత్వముఁ
మన్ననలిచ్చె, సోదరుని
మాదిరి ప్రేముడిచూఱఁగొల్పె, నే
నెన్నని చెప్ప నాయనెన
యించిన భూరిమహోపకారముల్ 24

అసువుల్ నిల్పిన పుణ్యమూర్తికిడఁగా
నర్హమ్ములౌ వస్తులే
యస దున్నం దనుపార్జన క్షమత నా
యందెట్టులుఁ లేద మా
నసికంబైన కృతజ్ఞతాభరము కొం
తందీర్చుకోఁ దత్కృపా
ప్రసరార్ద్రింబగు నాదరంబునకుఁ గా
వ్యం, బంకితం బిచ్చెదన్. 25

మును శ్రీనాథకవీంద్రచంద్రుఁడు రసాం
భోరాశియౌ కావ్యముం
బ్రణయం బొప్పఁగ బెండపూడి జలధి
ప్రాలేయరుఙ్మూర్తికి
చ్చెను, నేనుం బొనరింతునట్ల యనఘు
శ్రీనాథ మత్కావ్యవ
ర్తనలందుఁ మహనీయ సత్కృతిపతి
త్వప్రాప్తినే సామ్యముల్. 26

తన పెద్ద నవ్వుఁబోలిన వినిర్మలకీర్తి
కాకరంబని శశాంకార్ధమౌళి
తినయాశ్రితావన తత్పరత్వము గొన్న
పుమ్మూర్తియని రమామోహనుండు
తన జగత్సృష్టికంటెను విశాలమ్మైన
యాత్మకాస్పదమంచు నబ్జభవుఁడు
తమజీవ విద్య సంతిముదాఁకఁ జూచిన
పటుబుద్ధి యని దేవవైద్యయుగము
అతులితైశ్వర్యములును ననంతలక్ష్మి
యాయతాయువు వైద్య విద్యా ప్రశస్తి
పేర్మి నిడి ప్రోచెదరుగాక పెండపూడి
విమలవంశాబ్ధి ద్విజరాజుఁ బేర రాజు. 27

స్వస్తి.

శ్రీ

# రాజసందర్శనము

౧

శ్రీకరమైన విద్య సవ
రించి, జనస్తవనీయ పండితా
నీక విభూషితమ్ములగు
నీప సభాంతరసీమ లంది, య
స్తోక మతిప్రభావములు
చూపుట యుక్తము గాని కూపమం
డూకము లట్టు లిల్వెడక
నొచ్చుట మెచ్చుగునే బుధాళికిన్. 1

గురు శుశ్రూషయు మందశాచలముగా
గూఢార్థరత్నోల్లస
ద్వర విద్యాకలశాబ్ధి ద్రచ్చి, విమలో
దాత్తంబు సంవిత్సుధా
భరముం గొంటిని, దాని సాధుసుమనః
పాళీ సదాస్వాదన
స్థిరసార్థక్యముఁ జేసి, పొందవలదే
శ్రీనిత్య కీర్తిస్తుతుల్. 2

చిన్నతనంపుఁ జాపలము
చే సదసన్మతి లేని కార్యముల్

కొన్ని యొనర్చి యుండుట న
కుంఠితమత్ప్రతిభానవద్య వి
ద్యోన్నతి పాటి చేయక బు
ధోత్తము లెల్లరుఁ బూర్వరీతి నే
నన్నుఁ దలంచి మన్నన లొ
నర్చ రెటుల్ తొలఁగింతు నీసడిన్. 3

తనరాజ్యమ్మున సత్కవీశ్వరులు వి
ద్వద్వర్యు లెచ్చోట ను
న్నను, విన్నంతనె ప్రీతిసంభృత మనో
నాళీకుఁడై పార్థివ
ర్ధన భూపాలుఁడు పిల్వఁ బంచు నఁట స
త్కారమ్ములం జేయఁగా
నను రప్పింపఁడు వేరు నాపయిని నిం
దల్ మోపి వంచించిరో. 4

అధిగత సర్వశాస్త్రనిగ
మాంత పురాణకథావివేక స
న్నిధు లయి యుండియు, న్విబుధ
నేతలె కొంద ఱసూయ కెల్లలై
యధిపుల చెంత నన్యవిబు
ధాళిని గూఱిచి లేనిపోనివే
యధమపు గాథలో తెలుతు
రట్టిడి నా దెస నేమి పుట్టెనో, 5

అన్యసచ్ఛీలరాకామృతాంశుప్రభల్
కప్పంగఁ జాలెడి కారు మొయిలు
దురవేక్ష్యరోగబాహిర నిదానమ్ముగా
నఖిలాంగముల నేర్చు నామయమ్ము
కెలవకుండనె విషోగ్రజ్వాలలను మేను
నవయఁ జేసెడి వింత నల్లత్రాచు
నిర్నిమిత్తమ్ముగా నిద్రాశనమ్ముల
నుడిపి యేడ్పించు ప్రముక్కడి పిశాచి
నీచకార్యమ్ములకుఁ జేర్చు రాచబాట
యౌఁ గద యసూయ తద్వశగాత్ములగుచు
మామకానంతపాండితీ మహిమ కలఁపఁ
బ్రభునితో నెవ్వరే నింద పలికినారొ. 6

సరసాత్ముండు, విమృశ్యకారి, కవితా
సారస్యసంవేది, భూ
సురసేవాప్రియుఁ డింగితజ్ఞుఁడు, ధరే
శుండంచు విందున్ గదా
పరకీయోన్నతి సైఁపఁ జాల కథముల్
వాక్రుచ్చు వాక్యమ్ములం
బరిశీలింపక ప్రాకృతుండు వలె వి
శ్వాసమ్ము సంధించునే. 7

పతి యితరోక్తవాక్యములఁ
బ్రత్యయ ముంచి నను న్నిరాదరాం
కితమతిఁ జూచినం బ్రజల
కృత్యము లన్ని తలఁచి చేని స

ద్గతి నడపించు కృష్ణవసు
ధాపతి మామక శౌర్యమిత్రుఁ డ
మ్మతకరి నీచమానవుల
మాటల దబ్బఱ వెల్లడింపఁడే. 8

భూపతి పిల్వఁబంచుటకు
మున్నె చన స్మన సొప్ప దేమన
స్తాపక రావమానపుఁ బ్ర
సంగము కల్గునో యనుచుఁ గాన పృ
థ్వీపతి మన్మతిప్రతిభ
తీరు నెఱింగి మహాప్రసన్న తా
వ్యాపృతుఁడై ననుం బిలువఁ
బంచెడి దాఁకను వేచియుండెదన్. 9

నరపతులు కూపములవోలె దురవగాహు
లగుట జనులకు వారితో నతిపటుగుణ
కలిత సద్ఘటక ప్రాప కతనుగాక
యేల తమ యంత సిద్ధి వహించుఁ జనులు. 10

దారుణారణ్య మధ్యమున వెల్గుచు నేరి
నలరింపలేని పెన్నెలవిధాన
జలధిగర్భమున నుజ్జ్వల మాచు మనుజ దు
ర్గ్రాహ మైన సద్రత్న రాశి వోలెఁ
బర్ణశాఖాదుల బాగుగఁ బెరిగియు
ఫల మొసంగని పాదపమ్ము భంగి
నాదిశాంతము విశాలాకాశమునఁ బర్వి
వర్షింపకుండు సభ్రమ్ము రీతి

నిష్ఫలమ్ముగదా ప్రకృష్ట నిష్ఠురుఁడయి
కవుల విద్వాంసులను జాల గౌరవించు
సహృదయుండగు శ్రీహర్ష సార్వభౌము
నెడఁద మెప్పించలేని నా యింత చదువు. 11

అని చింతించుచుఁ బ్రీతికూట మను సా
ర్థాఖ్యాగ్రహారంబునన్
దన గేహస్థలి బాణసూరివరుఁ డుం
డ న్నిష్యుఁ డొక్కరుండు వే
వినతాంగుం డయి వచ్చి కృష్ణధరణీ
భృత్ప్రేషితుం డై మిమున్
గన నేతెంచిన దూత ద్వారమున ను
న్నాఁడం చెఱింగించినన్. 12

వెదుకంబోయిన తీవ కాలఁదగిలె
న్నింతయ్యొ నేఁడంచు స
మ్మద మేపారఁగ నేగుదెంచి కనియెం
బాణుండు వార్తాహరున్
వదనావేదితదూర భారగమన
ప్రాప్తశ్రముండయ్యు న
భ్యుదయాశంసిదరస్మితుం, న్నృపతిలే
ఖోద్యత్కరాంభోజునిన్. 13

మేలిమి బంగరు కాంతుల
మేలం బాడంగఁ దివురు మేని రుచులతో
వేలుపుగిరి యనఁ దగు స
న్మాళికి బాణునకు దూత నతుఁడై మ్రొక్కెన్. 14

అంత స్వీవనలిచ్చి వాణికవి భ
ద్రా సర్వలోకప్రజా
క్రాంతాకారణ బంధుమిత్రు లల కృ
ష్ణక్షోణి భృద్ధర్మ భూ
కాంతుల్ సేమముమైఁ బ్రవర్తిలుచు గే
కళ్యాణవ్రజంబునై
రంతర్వ్యస్థితిఁ గ్రాలునే పురి నటం
చాసక్తిఁ బ్రశ్నించినన్. 15

నృపుఁడును గృష్ణుఁడు న్సుఖులె
నిత్యశుభంబును బహ్వాకారణం
బు పరిఢవిల్లెడిం బురిని
బుణ్యచరిత్రుఁడు కృష్ణభూమిపుం
డపరిమితాదరంబు మెయి
నంపెను మీకొక లేఖ యిది మం
చుపకృతి మూర్తమైన గతి
నుండిన కమ్మయొసంగ దూతయున్. 16

ఆదరమేదురాత్ముఁ డయి
యయ్యది చేత గ్రహించి, కృష్ణభూ
మీదివిజాధినాథున క
మేయ కృపామతి కగ్గె మాపయిన్,
మాదురదృష్ట హేతువులు
మాసిన వింక నటంచుఁ బల్కి లే
ఖాధితవార్తలం జదువ
నుత్సుకుఁడై కవి విప్పు చుండఁగన్. 17

ఫలమున సంసారాయములు
పాటిలఁ జేయు వృథాలసత్వమం
చెలయరు పండిత ప్రవరు లెన్నఁడు
బానిని, లేఖలోపలం
గల పరమార్థ మిద్దియ, సు
ఖప్రతిపాదక మాను శిష్ట మి
ప్పలుకులు వాచికంబుగను
బంపె నృపుండని దూత చెప్పినన్. 18

విని యాత్రముమై నవు నవు
నని దూరాగమనజనిత మా బడలిక యా
తని మొగమునఁ గని బాఁబుఁ
డనిపెను విశ్రాంతి బొంద నగునెడ కతనిన్. 19

దినముఖ మాదిగా బయలు
దేఱిన తూరుపు కొండనుండి మిం
చిన రభసంబునన్ గగన
సీమ నిరంతర దీర్ఘయానముం
బూనరిచి, చాలఁగా బడలి
పోవుట నించుక విశ్రమమ్ము చే
కొన నన సూర్యుఁ డస్తగిరి
కూటమున న్విహరించె న త్తఱిన్. 20

ఖరకరు వేఁడి భానువుల
కర్కశతన్ భరియింపలేక మం
దిరముల యందు యుండి నళి
నీప్రియుఁ డస్తమహీధరాగ్రగో

చరుఁ డయి నంతఁ బై కరుగ
　　　సాగె జనాళి దినావసాన బం
ధురమృదుశీతలానిల మ
　　　నోజ్ఞ విహార సముత్సుకాత్ములై. 21

సరయముగా యథావిధిగ
　　　సంధ్య నుపాసనఁ జేసి, కృష్ణభూ
వరుఁడు మహాప్రసాదమునఁ
　　　బంపిన లేఖ పఠించు నాదరం
బురువుగ వేగమైఁ గుడిచి
　　　యుజ్జ్వలదీప సువర్ణ కాంతి కా
కర మయి పొల్చు లోపలి య
　　　గారముఁ జేరెను బాణుఁ డుత్కుఁడై. 22

## ౨

శ్రీయుతులకు సత్కవితా
శ్రీయుతుల కఖండవైదుషీసహితులకున్
ధీయుక్తిజిత సురోపా
ధ్యాయులకున్ బాణకవివతంసులకు నతుల్. 1

పరదురవాపపాండితిన
　　　పారముగా గడియించి, సత్కవి
త్వరసమహాప్రవాహప్రభ
　　　వమ్మునకున్ గిరిసార్వభౌములై,

స్థిరతరకీర్తి చంద్రికల
దిక్కులకు న్నవశోభ కూర్చు చం
దురులగు మీరు పూర్వసుహృ
ద్వర స్మరియింతురె కృష్ణభూపతిన్. 2
ప్రతిపక్షవిద్వద్ద్విప శ్రేణులకు హరి
స్వప్నీకృతము మీ వి శాలధిషణ
దశహరిద్వ్యాపిదు ర్వార్ద్ధ్యాత్రములకు నూ
త్నాంశుకీకృతము మీ యమలయశము
సహృదయ సంతతి శ్రవణద్వయికి నవ్య
భూషణీకృతము మీ ముద్దుఁగవిత
మూఢమానవ హృదంభోజాతతతి కినో
జ్వలరుచీకృతము మీ వచనసరణి
పండితులు గూడ విస్మయంపడుచుఁ బొగడి
చెప్పుకొనుచుండ నాలకించితిమి, యెడఁద
మోదపూర్ణమ్ముగా నింగి ముట్టి మిమ్ముఁ
గాంచ వలె నని చాల వాంఛించితిమిని. 3
మిమ్ముం గాంచి వివేకవారినిధులా
మీ వాక్కు లాలించి, మో
దమ్ముం బొందఁగ నేరమే, మయిన నా
త్మం బక్షపాత మ్మమే
యు మ్మై వర్తిలు మాకు మీయెడలఁ గ
ల్హారాకరంబందు దూ
ర మ్మందున్న శశాంకమూర్తికి జగా
రాగంబు సాజమ్మొగా. 4

పండితులుఁ గవీశ్వరులు
ప్రత్యహమ్ముఁ జను దెంచి హర్షభూ
మండల నేత మెచ్చుకొన
మాన్యమతిప్రతిభా కవిత్వముల్
పొందుగఁ జూపి కానుక ల
మేయము లొందుచునుండ మీరు రా
కుండుట చూచి మాహృదయ
ముత్తలపాటు వహించు మిత్రమా. 5
ఆదర మొప్ప లేదు కబు
రంపకముందర పోకవచ్చు నా
గాదె యటందు రేమొ, యది
గాదన, మీయసమాన శేముషీ
వైదుష లాలకించియు నృ
పాలుఁ డుపేక్ష వహించె దుర్జనుల్
మీదగు బాల్యచాపలము
లేనిది యున్నది పన్ని చెప్పుటన్. 6
సమదృష్టిన్ జగమంత చూచు సుజనుల్
సర్వప్రపంచమ్ము ని
త్యము మిత్రత్వమునే వహించుఁ దమ యం
దం చెంతు రే మాయ చి
త్తములన్ లేని కతానఁ గాని యనిమి
త్త ద్వేషులు న్మిత్రవ
రములున్ గల్గుట నైజ మొంతటి మహా
త్ముల్ శ్రేష్ఠికిన్ ధారుణిన్.. 7

ఓరువలేని వాఁడెవఁడో
యుజ్జ్వల తావకకీర్తి చంద్రికో
త్సారముసందుఁ గందు గలు
గఁ దమ యౌవనచాపలంబునుం
గూర్చి యేవో యేవో పలు
కఁ నృపు లుందరఁ, దోడనే సభా
స్తారు లదట్టిదే యనుచుఁ
దాళము వైతు, రశంకవృత్తిమై. 9

జ్ఞానప్రకాశ విరహితు
లైన జనుల చిత్తవృత్తు లక్కట! ప్రవహత్
పానీయము లట్టులు నీ
చానుగములు లోలములును నయి యుండుఁ గదా! 9

కొలువునయందు నేఁ డుచిత
గోష్ఠి యొనర్చుచు వేడ్క నుండ, మీ
యులఘు కవిత్వశక్తి విష
యంబు ప్రసక్తి వచ్చినంతనే
నలువురు మచ్చరంపు వచ
నంబులు పల్కఁగఁ రాజు వింటయే
కలుగును గాని సత్య మెఱుఁ
గం గను నెట్టులు చాల నుంటచే. 10

సమయము చూచి భూపతికిఁ
జన్న భవచ్చరితంబు చంచల
త్వమునకుఁ గారణం బనుచి
తం బుచితంబు నెఱుంగ నీని బా

ల్యాను యగు, మీరు కాదని య
ధార్థము చెప్పితి మాతఁడున్ బరా
క్రమములను బాటిసేయని వి
ధంబున నే కనిపించు నింతకున్. 11

కపచిన దేదియో కడచెఁ
గాలవిలంబన మేల చేయ ని
ష్పాదు సహితమ్ము, చెచ్చెరన
భూపతి దర్శన మాచరింపఁగాఁ
గడఁగుఁడు; పత్రముల్ ఫలని
కాయము లేని కుజంబుఁ బోలు మా
యొడయనిఁ జూడ రాని తమ
యుజ్జ్వలజీవితరీతి గ్రీమున్! 12

భూరివినోదభోగపరిపూర్ణులు
రాజులు, వారి కొల్వు స్వే
చ్ఛాచరతచిత్తవృత్తుల క
సంభవమన్నాట నిజంబ, కాని యా
ధారణ ధారుణీభృదభి
ధానులకున్ మన హర్ష దేవగో
త్రారికిఁ జూడ హస్తిమశ
కాంతర మున్నది సూరిశేఖరా! 13

శ్రితజనపోషణంబున, వ
శీకృతచిత్తత, ధర్మరక్షణా
వ్రతమున, సత్యవాఙ్నియమ
పాలనమందు, జనానురంజనా

యతమతి, హర్షవర్ధన ధ
రాధిపమౌళి నలాంబరీష భూ
పతులను దాట్టి తొల్లిటి నృ
పాలకపాళి తలంపఁ జేసెడిన్. 14

వెలల వాతని నేత్రముల మహాహంకార
కాలకూటవిషాగ్నిఁ గ్రక్కుదృష్టు
వినిపింప వతనినో టను దారుణోద్ధత్య
భయదరుగ్గద్గద భాషణములు
కనిపింప వతని వర్తనమందు నధికార
గాఢజ్వరోత్థవికారతులు
పొడచూప వతని మోమున విస్తృతైశ్వర్య
లాభదర్పోదగ్ర లాంఛనములు
కలుగ వాతని వ్యాపార విలసనముల
నతుల మదమోహ జనితవిస్మృతుల గతులు
రాజసూత్రుండె హర్షవర్ధనబలారి
ప్రజలొసర్చిన పుణ్యంబు ఫలముగాక. 15

సూనృత మాడెనా కరుణ
చూఱలొసంగెడి నెట్టిదోషికిన్,
మానస మిచ్చి మెచ్చికొన
నాం తిసవేసి పరిమ్రినిన్ మఱి
స్నానము లార్చ్చి, స్థైరి సయి
సన్ మనుచున్ శరణంబటన్న, భూ
జాని గుణంబు లెంత సర
సంఖ్యల్లో చూఁటేసు నాఁడె మీరావల్లున్. 16

రత్నబుద్ధి నృపాల రత్నమ్మునకు సుధీ
జనులంద, యుజ్జ్వల స్వర్ణములఁ గాదు;
ధ్యానంబు నృపతికి దానవంతములు కృ
త్యములంద, కరికరటములఁ గాదు;
రతి లసత్కవితాభి రతికి ముక్తాస్వచ్ఛ
మగుగుణంబులయంద నగలఁ గాదు;
ప్రీతి ధర్మావన ప్రీతచేతసునకు
యశమంద, తుచ్ఛదేహమునఁ గాదు;
భూషణచికీర్ష ధారుణీ భూషణునకు,
సకలదిశలంద, చర్మపు త్రికలవంటి
కాంతలం గాదు, తద్గుణకథనమందు
నతిశయోక్తికిఁ దావిసుమంత లేదు. 17

ఉరుమద మత్తతచేతను
బరుషత్వము వక్రతమత పడసిన వర్ణ
త్కర ముండ దెచ్చుటను మన
నరపాలుని పల్కు సరస నయసూక్తులలోఁ. 18

తనవైదుష్యము పెంపు పండితులకుఁ,
ధాత్రీపతిత్వమ్ము భృ
త్యనికాయమ్మున, కాత్మ మిత్రులకు, దే
హం బుల్లసద్ధర్మ సా
ధనకున్, సంపద బీదసాముల, కమి
త్రశ్రేణి విక్రాంతికిన్,
వినియోగింపడ నేలు నాతఁడు చతు
ర్నీరాకరాంతక్షితిన్. 19

వినుతరసోజ్జ్వలమ్ము, కవి
బృందమసంభ్రమదావహమ్ము, శో
భనగుణభాసురమ్ము, మధు
వైరిలసత్పదజాత, మర్థసా
ధనము త్వదీయచారుకవి
తాదివిజాపగ, వన్నె వాసియె
క్కైనసెడి హర్ష రాజపర
మేశ్వరు నొందల కెక్క కుండఁగన్. 20

వేయేల నిరతవిద్వ
ద్గేయుఁడు మారాజు పాద కిసలయ మహిత
చ్ఛాయ లభింపఁగ నేర్చిన
వ్యాయతసుకృతాత్ములా జనాళికిఁ దక్కున్. 21

క్షితిపతి కొల్వు సేఁత తమ
కీరితి వెన్నెలకు న్సరత్సమా
గతియని యెంచి మిత్రనిధి
కప్రణయంబు బహూకరించి స
మ్మతి సరుదేరఁగా వలయు
మానయసంఘుఁ జనోరగముల్ మహో
దృతిఁ గవిచంద్రమా! ఎదురు
తెన్నులు చూచెడి మీదు రాకకై. 22

ౘ

అని గతకాలపుం జెలిమి
యంతయు సత్కరయూప మందఁగా
నొనరిచి కృష్ణభూపతి ప
రోపకృతివ్రతి పంపినట్టి లే
ఖను గడు తత్పరత్వ మెసఁ
గం బఠియించి బుధాళిమాలికా
మణి వహియించె నుప్మిషిత
మానస మందు సమంద మోదమున్. 1

అప్పటికి నడిరేయగాట నొప్పుమీఱఁ
బ్రీతికుఁటాగ్రహార మ పేత నలన
మాప్తసుఖపారవశ్యము నగుచు యోగి
సత్తముని యాత్మ పగిది ప్రశాంతవృత్తి. 2

అత్తఱి యావనంపు సమ
యంపు సుహృత్తగు కృష్ణభూమిపా
లోత్తము సౌహృదంబు తన
యుల్లముసఁ నొసఁమూను మఁ నిప
శ్చిత్తిలకంబు శాణకపి
సెజ్జపయి న్మెయి చేర్చి భూమిభృ
త్సత్తమదర్శనోచిత వి
ధంబును గూర్చి తలంచె నిట్లుగన్. 3

విముఖతఁ బాల్చి యుండెఁ బృథి
వీపతి యీసున దుష్టులాడువా
క్యముల కతానఁ గృష్ణవసు
ధాధిపుఁ డాప్తనిధాన మాదరం
బమరఁగ రమ్మటంచుఁ గబు
రంపెను బోకకుఁ బోకయుంటకున్
స్తిమితము కాక డోల పగి
దిన్ హృదయమ్ము పరిభ్రమించెమన్. 4

ధరణీపాలుర కొల్వు కష్టతర మ
త్యంతమ్ము గంభీరమై
పరఁగున్ రాజకులమ్ము మున్ను గమన
ప్రత్యాగతుల్ శూన్య మౌ
వ్వారు మహాపూర్వులు రాజునాశ్రయము సం
పాదింపలే దింక నె
క్కారణిన్ హర్ష మహీపురందరు కటా
క్షశ్రీలు చేకూరునో. 5

నృపతుల తోడ మైత్రి యొన
రింపను. వారి మనఃప్రియంబుకై
కపటపుఁ బ్రేమ యుట్టి పడఁ
గా మెఱమెచ్చులు గుప్పరింప. వా
రపగత ధర్మమార్గ పరు
లై విహరించిన సైఁప, నాకుము
న్నపరిచితమ్ము లేక్రియ ధ
రాధిపు నాదృతి చూఱగొందునో. 6

లలితవిద్యార్యాషి నలరింతు నంచునా
యధిపతి సర్వశాస్త్రార్థవిదుండు
కవితాప్రసక్తి నాకర్ణింతు నందునా
ప్రాజాని బహుళస త్కావ్యకర్త
గాఢమైత్రీశక్తి కరంగింతు నందునా
భూనాధు మును చూడ నైన లేదు
శ్రీ మించు వారిచేఁ జెప్పింతు నందునా
నృపతివల్లభుల సౌహార్దము సున్న

పరివిమలచరిత్రచే వశం పఱుతు నన్న
బాల్యపు టెడాటమున నపవాదు మిన్న
విత్తమునఁ జేసి రాజు మెప్పింతు నన్న
మాటకును బొందు లేదల మాట మాట. 7

భూకాంతు దర్శనమున కి
దే కాల మటంచు వ్రాసె హితుఁడీ యదనుం
బోకార్చుకొన్న సిరి రా
మోకా లొడ్డిన ప్రకారముల్ తలకోవే. 8

భూవరు దర్శనంబునకుఁ
బోవలె నెట్టన యెట్టులైన నా
జీవితకాననంబు నిక
సింపఁగఁజేయు వసంత మియ్యదే
యావల దా యదృష్టపు న
యం బెటు లుండిన నట్టు లౌను భ
క్తావనబద్ధచిత్తులు పు
రారియుఁ గృష్ణుఁడు నన్నుఁ బ్రోవరే. 9

అని చింతించుచు బాణసత్కవి తదే
కాలోచనావ్యగ్రుఁడై
కనుదమ్ముల్ మొగిడించెఁ గాని కునుకొ
క్కండైన రాదాయె నా
మన సేదే నొక గాఢ చింతనమున
న్మగ్నమ్ము గా నుండినన్
దిను బోనమ్ము రుచించునే నరులకు
న్నిద్రాసుఖం బబ్బునే. 10

తన్నుం గాంచిన యంత భూపతి హృదం
తర్లగ్న మహా భక్తిమై
మన్నింపంగఁ దలంచునో యవమతిం
బాటింపఁగాఁ బూనునో
పున్నెం బెట్లు ఫలించునో యను తలం
పుల్ తక్క నన్యమ్ము త
ద్ధృన్నికేతము గర్భమందుఁ జొరద
య్యెం దన్నిశీథంబునన్. 11

నృపతి తన కైత మెచ్చి మన్నించు ననుచు
గ్రహావనోదంత మెంచె దూతాఁడు సనుచు
సొరిదిఁ బొంగుచు బిట్టు వందురుచు నతఁడు
కించిదవశేషముగను వేఁగించె రేయి. 12

తోఁచెన్ వేగుఁజుక్క, యెల్లెడలఁ బ్రి
త్యూషానిలాంకూరముల్
పేఁచెన్, ఋగ్యజుషానువాకములు వ
ల్లింపంగ శిష్యావళుల్

లేచెన్, వామనమూర్తి సన్నుతిల స
　　ల్లీలోక్తులేచెన్, గవి
ప్రాచీనాథు కనుంగవం బొలిచె ని
　　ద్రాచిహ్న లొక్కింతగన్. 13

కనుదోయి మూసినంతనె
జనపాలక దర్శనైక సక్తాంతరుఁడై
తనరు విపశ్చిద్వరునకుఁ
గనుపట్టెన్ దృశ్యమొకఁడు కలలో నిట్టుల్. 14

పరివిమలవారి పూర్ణము సు
　　వర్ణ పయోరుహషండ మండితం
బవు రమణీయ మానస స
　　రోఽంతర మందిర రాజహంస భ
క్త్యవనత శీర్ష మంచనివ
　　హంబు తనుం గెడఁగూడి కొల్వఁగా
ధవళ సరోజ పీఠికము
　　దంబున నోలగ ముండె నత్తఱిన్. 15

ఎలప్రాయంపు జగా నిగారములుమై
　　నింపార, నెమ్మోముపైఁ
గల కాంతు ల్విలసన్మతిప్రతిభవ
　　క్కాణింప, నందాలతా
వలమై కీవిఁదలిర్చు మందగతు లొ
　　ప్పార 'దత్సభాసీమకుం
గలహంసంబొకఁ డేగుదెంచి పతికిం
　　గై మోడ్పు సంధించినన్. 16

తెలితామర గద్దియపైఁ
గొలు వున్న మరాళరాజు, కొలని నలుదెసల్
కలయంగఁ గాంచి వచ్చిన
కలహంసం గూడఁ గనియుఁ గానని భంగిన్. 17

తన పని మగ్నుఁడై కెలని
తట్టున నున్న సితాంగపుంగవుం
గని యట కేగుదెంచిన ఖ
గంబు నవద్యగతప్రివర్తనం
బును గుఱియించి ధిక్కరణ
పూర్వముగా వచియించె నేదొ యా
వనసమయాత్తతన్మలిన
వర్తనమెల్ల నెఱింగియుండుటన్. 18

పరిపన్మధ్యము చొచ్చి క్రొమ్మెక్కిన తనున్
స్పష్టమ్ముగాఁ జూచియున్
వరటాకాంతుఁడు పల్కరింపమియు, నిం
దావృత్తి తోఁపంగ డె
ప్పరముల్ నెచ్చెలితోడఁ బల్కుటయు, సం
భావించి యాగంతుకుం
డురులజ్జావనతాస్యుఁడై తిరిగి పో
నూహించె ఖేదంబునన్. 19

అంతలోఁ గొల్వు చాలించె నంచఱేఁడు
సభ్యు లెల్లరు తమ నివాసముల కేగ
నాసనోత్థితు లైరి, హంసాధిపుండు
గద్దెడిగి నూతనాగతు కడకు నరిగి. 20

కవ్వుఁగింటం గదియించి సత్కవిసగా
కార్యాంతరవ్యాపృతిన్
భవదీయాగమనమ్ము స్వాగతి సం
భావింప లేనైతి లో
నవమానమ్ముఁ దలంప కియ్యెడ మదీ
యాస్థాన మందుండి మీ
కవితాసూనరసప్రవాహములఁ దో
గంజేయరే మమ్ములన్. 21

అని హంసప్రభుఁ డాడ మానమున స
ర్థాంగీకృతిం జూపి నూ
తన చక్రాంగము కేలు మోప్ప నలిక
స్థానంబునన్ దానిఁగ
న్గొని సంసద్గతహంసముల్ పరమసం
తుష్టాంతరంగమ్ములై
ఘానరించెన్ మణినూపురధ్వనిసఖ
మ్ముల్ మంజులాలాపముల్. 22

సరిగా నయ్యెడఁ దెల్లవాఱుట మహీ
జాతావళీ శాఖికాం
తరనీడస్థవిహంగ సంతతి ప్రబు
ద్ధంబై యొనర్చెన్ మనో
హరమంజుస్వన మిట్లు లో బయట నొ
ప్పార న్నినాదమ్ముని
ద్ధుర మేల్కాంచెఁ గవీశ్వరుండు కలయం
దుం గన్నదే యెంచుచున్. 23

సురవిభు వెసఁ బొలిచెను భా
స్కరబింబం బప్పు డంధకార మనెడి ని
గ్గగ్నైగిఁ బొసఁగను రాత్రిం
చర శత్రువు విసరి నట్టి చక్రం బనఁగన్. 24

రాత్రిరి యెల్ల మూసికొని
రవ్యుదయం బయినంత నే పరి
స్ఫుతదళంబు లైన సర
సీస్థిత వారిజముల్ చెలంగె నా
రాత్రిరి నిద్రచే మొగిడి
రవ్యుదయం బయినంతనే పరి
స్ఫుతము లైన ఉప్పల హసించు
కపీంద్రుని కండ్ల పోలికన్. 25

౪

అంతన్ భానుఁడు సెజ్జ వీడి వడి క
ల్యాంపుం బనుల్ తీర్చి భా
స్వంతున్ నిశ్చలభక్తిఁ గొల్చి కల .
దృష్టం బైన వృత్తాంత మ
త్యంతాశ్చర్యద మై ధరాపతిదిదృ
క్షోత్సుక్య వేగోల్లల
త్స్వాంతుండై తననాఁటి పూనికకు సం
బద్ధంబుగా నుండుటన్. 1

తన యిల్లాలిని జెంతకుం బిలిచి కాం
తా! హర్ష భూపాలద
ర్శనముం జేయఁగ రమ్మటంచు మన కృ
ష్ణక్షోణినాథుండు దూ
తను బుచ్చెం గద తత్ప్రియత్నగత చిం
తాలోల చిత్తుండనై
వినుమా! రాత్రి చతుర్థయామమున నే
వింతౌ కలం గాంచితిన్. 2

అని తన కన్న స్వప్న మిసు
మంతయు వీడక పూస గ్రుచ్చిన
ట్లనఘుఁడు భార్యకు న్విని చె
నామెయు ధీనిధి కాన తత్కథా
వినిహిత మర్థ మెంచి పృథి
వీపతిదర్శనయత్న మిప్డు శో
భన పరిణామ మయ్యెడి ధ్రు
వంబుగ నంచును బ్రోత్సహించినన్. 3

కవిచూడామణి తాను వెండియుఁ గలం
గన్నట్టి యా సన్నివే
శవిధం బంతయు లోఁ దలంచుచు మన
శ్చాంచల్యమున్ బాసి కే
శవుపైఁ బర్వతకన్యకాధవునిపై
సంధించి భారమ్ము భూ
ధవ సందర్శనయాన నిశ్చయ హృదం
తర్భాగుఁడై యుండఁగన్.

గమనాయాసముచే నొడ ల్మఱచి సౌ
    ఖ్యం బార నాభాస్కరో
ద్గమము న్నిద్దుర చెంది వేగమెయి ప్రా
    తఃకృత్యముల్ తీర్చి కృ
ష్ణమహీపాలకు దూత బాణకవి సం
    దర్శించె నత్యంత భ
క్తమలాత్ముం డయి ఫాలభాగమున హ
    స్తాంభోజముల్ మోడ్చుచున్. 5

అతనిం గాంచి కవీశ్వరుం డుచిత పీ
    ఠాసీనుఁ గావించి యా
ప్తతమా! కృష్ణధరాధినాథునకు నా
    పై భూరిదాక్షిణ్య సం
భృతచిత్త బయి యుంటఁ గాదె నినుఁ బం
    పించెన్ మదీయాత్త పు
ణ్యాతతుల్ పండెను నేఁటి కిప్పుడ ప్రయా
    ణం బౌదమం చాదృతిన్. 6

లోనికేగి భూమిజాని దర్శనమున
కరుగుచుండ జాయ కెఱుఁగఁ జెప్పి
తన్ముఖేందుబింబ దర్శిత మ్మగు చిఱు
నగవు వెన్నెలల మనంబు పొంగ. 7

స్నానం బాడి సుధాంశు శుద్ధ పరిధా
    నం బిమ్ముగాఁ దాల్చి హ
స్తానం బూని జపాక్షదామమును బ్ర
    స్థానోచితం బైన సూ

క్తానీకంబు పఠించి పల్కఁగ తుషా
రాహార్య రాట్కన్యకా
ప్రాణేశుం గొలిచెన్ బదారు పరిచ
ర్యల్ నిష్ఠఁ గావించుచున్. 8

తొలుదొల్త నాహుతమ్ములు
తిలబీజము లెల్లఁ గాలి ప్రేల్చుచు నుండం
బలుమాఱు నేయి వేల్చుట
నలవోకన్ మండు నగ్ని నాతఁడు కొల్చెన్. 9

ముదమారంగ ననుంగుఁ బత్ని గమనం
పు న్మంగళాచారముల్
పదిలింపన్, గురుమిత్రవర్గము లన
ల్పప్రీతిఁ జూడంగ రా
ముదుసళ్ళొ పరిచారకుల్ నుతి శతం
బు ల్వల్క సత్పుత్ర దో
హదముం జేసె విపశ్చిదగ్రగుఁడు సి
ద్ధాంతోదిత ప్రక్రియన్. 10

శక్తివంచన లేక సద్విప్రవరులకు
బంగార మొక్కింత పంచిపెట్టి
కడుఁబ్రీతి వత్సమ్ము కాయమ్ము చుంబించు
హోమధేనువు చుట్టు నొదిగి తిరిగి
యవసాంకురంబుల నదిమి గ్రుచ్చిన కొండ
గోగు పూవులు చెవి కొన ధరించి
మృగనాభిమిశ్రిత మ్మగు చందనపుఁ బంక
మురమునందును బాహుయుగళి నలఁది

వయసు పెద్దలు మేలి దీవన లొసంగ
ధర్మగేహిని ఛాత్రసంతతులు గూడి
యానసన్నాహములు శ్రద్ధ నాచరింప
సజ్జమయ్యెం దయ్యె సుకవి ప్రస్థానమునకు. 11
కులదైవమ్ముల కంజలించి యనుర
క్తుల్ ధారుణీదేవతల్
ఫలపుష్పాదికహస్తులై యనుసరిం
పఁ బిష్టపంచాంగుళం
బుల శుద్ధంబగు పూర్ణకుంభమును స
మ్మోదంబునం జూచు చిల్
వెడలెఁ బ్రాణవిపశ్చితుండు కుడికా
ల్మెల్లంగ ము న్మోపుచున్. 12
కవి యిలు విడుసమయంబున
నవనత వక్త్రేందుబింబ యాతని యిల్లా
ల్త్రావగముల నవ్వు చూపుల
నివహము పాథేయ మట్లు నెఱి నడరించెన్. 13
సురపతి దిఙ్ముఖంబు పయి
సూర్యుని బింబ మటుల్ లలాటికాం
తరమునయందుఁ గుంకుమకృ
తం బగు పెన్తిలకంబు గ్రాలఁగా
ధరణి ధరాధినాథ దుహి
తం దలఁపించెడి పుణ్యకాంత యొ
క్కరుతుక తోల్పఁగా సభిము
ఖంబయి వచ్చెను బాణసూరికిన్. 14

తేఁ గాంతారాంతాగ్ని బరియుగ్య సుపాయు
స్థం బౌటకుఁ గూర్చి యి
చ్చిన వస్తుప్రతతి స్వీకరించుచు మహీ
క్షిద్దూతి వెన్వెంట రా
మనుజాక్షీశ్వరదర్శనైకవిషయో
త్సుకాంతరంగంబుతోఁ
జనుచుండెఁ గవిసార్వభౌముఁడు మహ
త్సంభోగసౌభాగ్యదత్తిన్. 18

ఘనునెడ నేదో విషం
బును గూర్చి దూత పలుకఁ బోయినఁ గవియున్
వినిపించుకొనక యుసుగు
స్సుని మన్యాలోచనా నిమగ్నుం డౌటన్. 19

ఖరకరుతాపమగ్గలము
గాఁ బథిపార్శ్వ తలస్థితోల్ల స
త్తరువుల నీడ నిల్చుచు క్షు
ధావ్యథ కల్గిన పట్ల మేదురా
దరమున నింటి యొద్ద వని
తామణి కూర్చిన భక్ష్యముల్ ఫలో
త్కరము భుజించుచుం జనిరి
కవ్యమరేంద్రుఁడు రాజదూతయున్. 20

ఒకసారి నిజయాత్రావృత్తాంతముఁ దలంచి
చేతోంతరమ్మున సిగ్గుఁ జెందు
నొకసారి పరుల యూహకుఁ గూడ నందని
తన విద్య నెంచి శ్లాఘించి పరిపొంచు

నొకసారి హర్ష దేవోపేక్ష తలపోసి
  యెడఁద నుమ్మలికంపుఁ గడలిసేయు
నొకసారి కృష్ణభూమికళత్రు నిర్హేతు
  కాదరం బెంచి యానందమొందు
నొక్కతఱి దూతఁ గాంచి యేమోయి! హర్ష
సార్వభౌముని సౌమ్యతాశయము లెట్టి
వనుచుఁ బ్రశ్నించు సుకవి లోకాగ్రయాయి
యడవి మార్గమ్ము వెంబడి సరుగుచుండి. 21

షడమటికొండ నెత్తముల
  పై జలజాప్తుఁడు చేరు వేళ న
య్యడవి మనోజ్ఞ దృశ్యనిచ
  యంబుల నారసి పుల్కరించు, నె
క్కుడు మధురమ్ముగా విహగ
  కూజితము ల్విని పారవశ్యముం
బడయుఁ గవీంద్రుఁడౌ సరస
  భావులు రంజిలరే మనోజ్ఞతన్. 22

తపనుం డపరాచలమున
కపసరిలన్ మొగుడు తమ్ము లంకించిన య
ట్లపరాహ్ణకాలజనితా
తపము పొరింబోరిగ నల్పతం గన సాగెన్. 23

ఉరగపుఁ బగ్గపు స్గమి న
  నూరుఁడు కేల బిగించి లాగ సు
స్థిరత హరిత్తురంగములు
  శీర్షము లెత్తుచు నిల్చె; భాస్కరుం

పరదము నుండి డిగ్గి చర
మావని భృద్విపమస్థలంబులం
దరుగుచుఁ ద్రొట్టుచేఁ బడియె
నవ్వలివంక సముద్రమందునన్. 24
దివిజసరిత్తటమ్మునకు
దృష్టిగతమ్మయి యుంట దూతయుం
గవియును నాఁటిరాతిరి సు
ఖప్రదశీతల వాయుశోభనం
బవు నౌక త్రోవనందు విడి
యంగఁ దలంచిరి దీర్ఘయాన సం
భవవితతశ్రమాలస స
మస్తశరీరులు హీనసత్త్వులై. 25

ॐ

అరుఁగ ద్రతికిన్ మును ని
ద్దుర మేల్కని కవియు రాజదూతయుఁ బ్రాతః
కరణీయము లొనరిచి సుర
సరిదుత్తరణంబు చేసి చని రవ్వలికిన్. 1
అవనీపాలక దర్శనోత్సుకత మా
ర్గాయాసముం బాప నే
త్రవినోదంబు నొసంగు దృశ్యములు సం
దర్శించుచున్, పండిత

స్తవనీయంబులు ఘోషనిస్సాణము లు
ద్ఘాటించుచుండ, రాజధా
న్యవతంసంబును జేరి రిద్వురు సము
ద్యద్వేగయానంబులన్. 2

అలసటతీర నాఁటికొక
యాప్తగృహంబున విశ్రమించి పెం
దలకడ లేచి ప్రాతరుచి
తక్రియ లన్నియు నాచరించి ని
శ్చలమగు భక్తి శైలతను
జాహృదయేశ్వరుఁ గొల్చి పూత మే
ఖలకుఁడు వెంట నంటఁ గవి
ప్సాపతి దుర్గముచెంతకుం జనెన్. 3

దుర్గద్వారముఁ జొచ్చి యందుఁ గల ప
స్తువ్రాతమున్ హస్తిగో
వర్గంబుం గని విస్మయంపడు కవి
ప్రాలేయ భానున్ వచ
స్సర్గప్రీణితలోకు, దూత గని వా
చామాధురుల్ మీఱఁగా
మార్గంబందలి యబ్బురంబులు వచిం
పన్ సాగె నీరీతిగన్. 4

అనిలముచేఁ జలించు తల
లందలి తెల్లని చామరంబు ల
య్యైనరథవాహసంతతి ప
యిం బడఁ దాల్చిన ఱెక్క-జంటలో

యున వెలుఁగొంద పేఁషల సు
    రాశ్వము సైతము పోరు సేయ ర
మ్మను నటు లున్న జేని జవ
    నాశ్వములన్ బరికించితే సుధీ. 5

నిరతము కదలించెడి త
త్సరముల పటపటరవంబు తోఁచెడి రాజ్యేం
దిర నాట్యము చేయుంపఁగఁ
బరఁగించెడి మద్దెలల శుభస్వన మనఁగన్. 6

క్రోశము లిన్ని యిన్ని త్రుటి
    లో నడవంగలవంచుఁ దెల్పఁగా
వ్రాసిన యక్కరాలనఁ బ
    రంగెడి గవ్వలమాల లట్టులన్
భాసిలు మూర్ధమందు పలు
    వన్నెల రోమపు రజ్జువుల్ జటా
పాశము లట్టు లొప్ప నిలు
    వంబడు నొంటెలఁ గంటె ధీమణీ ! 7

నీలగళాళికిన్ బృషవి,
    నింగిని జాతకపక్షి పాళికిన్
జాల మహోత్సవమ్ముదఁగఁ
    జాలెడి బృంహితనిస్వనమ్ములన్
జీలుచుచుం దిశల్ మదవి
    శేషపరిమళముల్ వెలార్చుచున్
నీలనగమ్ములట్లు తవ
    శిల్లు మదద్విరదాళిఁ గాంచితే. 8

అల్లదె వానిమధ్య నల
రారెడు హర్ష మహీబలద్వీప
ద్వల్లభ మా మతంగజము,
దర్పశతాభిధ మాహవంబులం
దెల్లవిభూతులోడి ధర
ణీశులు కాననసీమ లందియున్
దల్లడపాటుమానరు గ
దా! తదపార పరాక్రమస్మృతిన్. 9

సతతస్రవద్దాన జలవాహినీ ప్రవా
హములకఁ గాల వర్షాగమమ్ము
సప్తచ్ఛదానిల సౌరభోరుప్రసా
రములకఁ సత్య శరత్సమయము
నిరతనీహారశీకరసముత్కర వృష్టి
మర్యాద కపర హేమంతఋతువు
దశదిశాకుహర భేదనకల్యగంభీర
గర్జితాళికి వింత కారుమొయిలు
మత్తమధుపావళికిఁ బాన మంటపమ్ము
చక్రవర్తికి బాహ్యసంస్థ మ్మొడంద
దర్పశతమిది దిక్కరీం ద్రములసైత
ముల్లమున లెక్కసేయక యుక్కమీఱు. 10

ఇసరుచినవ్వునట్లు పవ
లెల్లను బున్నమనాఁటిరేయిగా
నొసరుచునట్టు లంబరమ
హోదధిఁ బెల్లని ఫేనపుంజముల్

నినిచెూపు నట్టు లెండ కబ
ళించెడు నట్టులు వేల్పుతేని ల
క్ష్మినిఁ హసియించు నట్లిలమి
మీాఁజెూఁ గంటె సితాతపత్రముల్. 11

ధరణికిఁ గాశపుష్పనము
దాయసితంబు నకాలసిద్ధమౌ
శరదృతువున్ ఘటించుచు, ది
శావితతిన్ క్షణదృష్టనష్టమౌ
కరణి నొనర్చుచుఁ, బిసని
కాయగతామలతంతువుల్ నభో
తరమునఁ జిమ్ము నట్లలరు
దొలఁ జలత్సిత చామరావళుల్. 12

అవనిపుదర్శనావసర
మబ్బమిఁ గల్గు నవజ్ఞచే శిరం
బవనతముం బొనర్చి మొగ
మచ్ఛ నఖప్రతిబింబి తమ్ముగా
నవజిత పూర్వుఁడైన వసు
ధాధిపుఁ డెవ్వఁడో లజ్జ మస్తకం
బవయవసాళి దాచుకొను
నట్టులు తోఁచెడి నార్య! చూచితే. 12

ఏమియుఁదోఁపకుండుట మ
హీస్థలి బొట్టనవ్రేలిగోరిచేఁ

తలపతి భూరిభూతి సము
దారత నూఱవ పాలి తోఁచు గన్. 20
అని తలపోయుచుండ, వసు
ధాధిపు దూత సింహద్వారము కడ
వినయవ శాంగుఁడై యుచిత
వేషము మంజులభాష లొప్ప స
య్యనఘునిఁ జేర నేగి ప్రతి
హారకులాగ్రణి కేలుమోడ్చి యి
ట్లనియె సమంచితాదర న
యప్రియభక్తులు సందడింపఁగాన్. 21
కవిచూడామణి ! కృష్ణభూవరుఁడు మీ
కై యింతకాలంబు గా
రవ మేపారఁగ వేచి కొల్వుఁ గరిగెన్
రాజేంద్రుఁ డాస్థానమం
దవనీపాలక సేవితుం డయి వినో
దాలాపముల్ చేయు ; రం
డవకాశం బిదె దర్శనంబున కటం
చన్నంత సంతుష్టుఁడై. 22
జని చరితార్థమయ్యె నృప
చంద్రుని మానసమందుమాపయిన్
ఘనతర మానుగ్రహము
కల్గె నటంచుఁ గవిప్రకాండుఁ డ

జ్జనపతి కొల్వుకూటము దె
స న్జనియెన్ బ్రతిహారుఁ డల్లన
ల్లన మును పోవు చద్భుతము
లన్ వివరించుచుఁ ద్రోవ చూపఁగన్. 23

౬

అదినృపాస్థానసీమ శ్రీ హర్ష దేవు
మహిత పాదాబ్జములకు సామంతనృపులు
నతులొనర్చుచు నిజశిరఃస్థితకిరీట
రత్నరుచి నిచ్చుచుండ్రి నీరాజనములు. 1

కరుణకుఁ బెన్నిధానము, వి
కాసము సేనధి, రాచఠీవికిం
దిరమగు నిక్క, విద్యలకు
దీవి, మతిప్రభ కాకరమ్ము, రా
జ్యరమకుఁ బ్రాపు, మంజులవ
చస్సులకు న్నిలయంబునై సభాం
తరమున హర్షభూపతి సు
ధర్మఁ బురందరుఁ డట్లు శోభిలెన్. 2

బారులుతీర్చి కేలఁ గర
వాలముల న్ధరియించి సేవకుల్
దూరమునన్ నిలంబడ హి
తుల్ బుధవర్గము రాజలోకమున్

జేరువఁ గూరుచుండి తను
నిర్గత కాంతుల నోలలాడఁగా
భూరమణుండు రాజిలె స
ముజ్జ్వల దున్నత సింహపీఠికన్. 3
విషమనృపాల నీతిపద
విం జరంగంబులు లోఁ బ్రుపాంగఁ ౦
దుసికిలు నేమొ యన్న వెఱ
తోఁ గయిఁ దాలిచి ధర్మదండముఁ
దెస లెకిమీం ద్రోనర్చు కర
ణీయములన్ బరికింపనో యనన్
లసదవలోకనమ్ముల వె
లార్చుచునుండె నతండు నల్గడన్. 4
కలయంగ మేన సలఁదిన
మలయజపుం బూఁత యతని మై మవ్వపుఁ బె
న్జలరాశి యలలఁ గూడిన
తెలి నురువుల మొత్తమట్లు దీప్తి వహించెన్. 5
చేసిన యాజి వింతలు వ
చించుచు నుండె నతండు తజ్జయ
శ్రీ సవిశేషరాగ వివ
శీకృత పంపిన నర్మగర్భ సం
దేశము నాలకించిన గ
తిన్ బులకించిన రెండు చెక్కులం

భాసిత మందహాసరుచి
మాలికలన్ బ్రసరింపఁ జేయుచున్. 6

అరుణాకార పదంబులున్ సుగతర
మ్యం బూరుయుగ్మంబు భా
స్వాన స్త్రాయుధ నిష్ఠురంబగు ప్రకో
ష్ఠంబున్ వృషస్కంధమున్
నగచంద్రాస్యము కృష్ణకేశము మెయిన్
భాస్ఫిల్లుటన్ ధారుణీ
వరుఁ డిప్పారె సమస్తదైవతమయు
త్వం బాత్మ సంధిల్లినాన్. 7

కని సతి నెత్తినెత్తి నిడిన
నై వసి ముత్తెపు మేఖలావళుల్
విలసిలు పాదపీఠమునఁ
బృథ్వీతలం బఖిలంబు కాంతికం
దళిత మొసర్చు వామచర
ణంబును మాత్రము మోపియుంటచే
నలరె నతండు కాళియ ఫ
ణావళిఁ ద్రొక్కెడి కృష్ణుఁడో యనన్. 8

పొత్తు వహించి జేని యుర
మున్ ముఖమున్ విడకున్న లచ్చికిన్
బొత్తపుఁ బూవుఁబోడి కిర
వుల్ విభజింపఁజేసి యగాసవాలో, తా

నత్రిశి భూమిభారము వ
హీంపుని మూంపుల మోపి నిద్రచే
మత్తిలు శేషుఁడో యనఁగ
మాలిక రంజిలెఁ దద్గళంబునన్. 9

తెల్లని చామరములు గొని
యల్లన వీచెడి లతాంగి యాతని నును చె
క్కిళ్లను బ్రతిబింబితమై
చెల్లె న్వదనస్థ పలుకుఁ జేడియ యనఁగన్. 10

మధురంబు లైన సంభాషణేక్షణములఁ
గానిపించెడి జగా గఱువతనము
సకలసర్వంసహా సామ్రాజ్యలక్ష్మికిఁ
బ్రియనివాసం బైన వెడఁద యురము
ధవళ సరోరుహ ద్వయికిఁ దోఁబుట్టువై
చెన్నుమీఱెడి సోగ కన్నుఁదోయి
దిననాథ విపులకాంతి స్ఫూర్తి నపరత్న
భాసురచ్ఛవిసము జ్జ్వలమకుటము
దిగ్గజకరంబులకు వంక తీర్చు దీర్ఘ
బాహుయుగళము, చంద్రబిం బంబునోరు
నతకరించుమనోహరా స్యమ్మునతని
క్షితిపతిత్వము చెప్పక చెప్పుచుండె. 11

ధనములు స్నేహశూన్యుఁ డని,
తప్పిదముల్ దరిచేర రానివాఁ

డనుచు, నగమ్ము? డంచుః గలి,
యాత్మభవుండు జితేంద్రియత్వశో
భనుః డనుచు, ద్విషత్తతు ల
పారసహాయుః డటంచు నెచ్చెలుల్
చనవరి యంచు నాతని దె
సన్ వహియింత్రు భయానురాగముల్. 12

ప్రతిహారుండును దూత ముందు నడవన్
బాణుండు మార్గస్థితా
ద్భుతముల్ చూచుచుఁ గొల్వు చొచ్చి కనియెన్
భూభృత్సుధీమిత్ర సం
తతిమధ్య ద్విజపాళిమధ్య రజనీ
నాథుండు వోలెన్ సమం
చితకాంత్యున్నతి వెల్గు హర్ష ధరణీ
క్షిన్మౌళి మాణిక్యమున్. 13

కని నిగృహీతుని పోలిక
ననుగ్రహం బందఁ గోరు నాతని వలె నా
ననము పులకింప నశ్రుల్
కనుఁగవ నిండంగ నిట్లు గాఁ దలపోసెన్. 14

క్షితి రాజన్వతి యయ్యె వేని కతనన్
శ్రీదేవి కెవ్వాఁడు సం
తతవాసం బగు, సూరిసంతతికి బృం
దారావనీజం బెవం

డతిలోకాద్భుత సద్గుణంబుల కెవం
డాధార మార్తావన
వ్రత దీక్షాపరుఁ డెవ్వఁ డా ఘనుఁడు హా
రక్షోణిపుం డీతఁడా ? 15
హరి వోలె నీభూమి వరుఁడు బాల్యమునందు
నృపవిరోధమ్ము నార్జింపలేదు
ఇందుశేఖరుని యట్లీ మహీపాల శే
ఖరుఁడు దక్షత్రాసకరుఁడు కాఁడు
పాకశాసనుని కైవడి నీ నృపాలుండు
గోత్రవర్గవినాశకుండు గాఁడు
ఇందుసంపద వోలె నీమహారాజు భా
గ్యమ్మెప్డు దోషోపహతము కాదు
యక్షనాథుని సన్నిధు లట్టు లితని
సన్నిధులు వ్యర్థములు కావు, శమను భంగిఁ
గాఁ డితఁడు దండధారి, యీ ఘనుని రాజ్య
మహాహా ! యలరారుచుండు సత్యమర మగుచు. 16
రమణీయాకృతి యైన, గమ్యుఁ డయినన్
రాజేంద్రుఁ జేరంగఁ జి
త్తము విస్తారభయాకులం బయి కలం
తం జెందెడిన్ భూప స
త్తముఁ డీతండ క్షణక్షణమ్ము నయన
ద్వంద్వంబునన్ వార్ని భా

నము చందంబునఁ గానిపించెడి వినూ
త్నం బైన రూపంబునన్. 17

అనుచు మనమున వర్ణించు కొనుచు రాజ
సేవకానీతపథమునఁ జెంత కరిగి
వినయమును భక్తి తగ నుపవీతి యగుచుఁ
జెవుల నిండుగ పేరి నాశీర్వదించె. 18

అత్తఱి రాజసౌధమున
కవ్వల నుండిన హస్తిపాలుఁ డు
న్మత్తకరీంద్రమున్ గుఱిచి
మంజులభంగి గజేంద్ర! మాని నీ
చిత్తమునందుఁ జాపలము
శీర్షము వంపు వినీతివై సదా
యుత్తము సుమ్మి సింహాసఖ
రాభము నిల్లని మందలించినన్. 19

అది విని సార్వభౌముఁడు ని
జాగ్రతలస్థితుఁ బండితుం బదిం
బది పరికించి ద్వారపరి
పాలకుతో ననె నీతఁడా జగ
ద్విదితయశుండు బాణుఁ డని
పృథ్వీధరాంతర కందరాముఖా
భ్యుదితమృగేంద్ర గర్జిత స
ముజ్జ్వలకంఠరవంబు మీఱఁగన్. 20

అంతట ద్వారపాలుఁడు ధ
రాధిప ! చిత్త మింతండ బాణుఁ డ
న్నంతనె చక్రవర్తి మొగ
మవ్వలి వంకకుఁ ద్రిప్పి రక్తనే
త్రాంతము లల్క తెల్పఁగ ని
జాంతనిషణ్ణుఁడు మాళ్వరాజుతో
నింత మహాభుజంగుఁ డితఁ
డే సుమి యంచు వచించె మెల్లగా. 21

మాలవ రాజు తేఁ డనిన
మాటల యర్థ మెఱుంగఁ డాయె, భూ
పాలకు లన్య లెవ్వరును
హా తెఱ విప్పర, బాణుఁడంత ల
జ్జాలసచిత్తుఁ డానతము
ఖాబ్జుఁడునై క్షణ కాలముండి కాం
తాళము మీఱ నిట్లు జన
నాథునితోఁ బలికెన్ వినీతిమై. 22

కలగూ పెఱుఁగక దేవర
ఖలమతు లెవ్వారో యనిన కపటోక్తుల వీ
నులఁ జొన్పి యీ తెఱంగునఁ
బలువురిలో నన్నుఁ గూర్చి పలుకుట మేలే? 23

జగము యథేష్టవర్తనము,
సత్య మసత్య మటం చెఱుంగకుం

డఁగ వచియించు వేది యయి
నన్, జనవాక్కులు చిత్రచిత్రముల్
తగిన పరీక్ష చేసి యన్న
తంబో యథార్థమొ త్రచ్చి చూడ కో
సుగుణనిధాన విన్న నచ
నుల్ వినినట్టులె విశ్వసింతువే. 24

బ్రాహ్మణుండను సోమ పాయివాత్స్యాయన
వంశంబునం దుద్భవంబుఁ గంటి
నాగమోక్త విధాన మలరంగ నుపనయ
నాది సంస్కారమ్ము లన్ని గొంటి
వేదవేదాంగముల్ వివిధశాస్త్రమ్ములు
సర్వతోముఖముగాఁ జదివియుంటి
ననుకూల భార్యఁ జేకొని గృహస్థుండనై
యతిథి పూజానంద మందుచుంటి
ప్రత్యహము భక్తితత్పరత్వం బెసంగ
శ్రితజనావను శివునిఁ బూజించుచుంటి
నిట్టి ననుఁ గొల్వనందు శిష్టేతరుఁ డని
పేరుకొనఁ బాడి యౌనె పృథ్వీమహేంద్ర! 25

"కామే భుజంగతా" పర
భూమీశ్వర ప్రాణవాయు భుజగాధిప! నిం
దామయములు నీవాక్కులు
నామది నొనరించు వేదనావికలముగన్. 26

పరమున నచ్చటం జెఱగు
    పాటిల నీయని చాపలంపు టా
చరణము లేవొ బాల్యము వ
    శంబునఁ జేసితి నేమొ, వానికై
కర మనుతాప మందు చధి
    కంబుగ సిగ్గిలుచుంటి గ్రామణీ
వర ! చపలత్వ మెవ్వరికి
    బాల్యనిసర్గము కాకయుండెడిన్. 27

అనుపమశాంతి శాక్యముని
    వై, మను వాట్టలు వర్ణ ధర్మముల్
పెనుచుచు, దక్షిణేశ్వరు వ
    లె న్నమవర్తిత దండధారివై
దినకర తేజ మొప్ప, భువి
    దేవర పాలన చేయుచుండ దు
ర్నియము మాట యెత్తఁ డొన
    రింపఁగ నెవ్వఁడు సాహసించెడిన్. 28

జక్కవ లాత్మ సిగ్గిలక
    చానలఁ గూడవు, వానరావళుల్
తక్కి భయంబు నైజచప
    లత్వము చూపవు, స్వేచ్ఛ నాన వే
లెక్కయు లేక తేనియ ల
    క్షిప్రకరంబులు నీ భయానఁ, ది

ర్యక్కులై యిట్టులుండ మను
జావళిఁ గూర్చి చెప్పనేటికిన్. 29

వేయి వచింపనేల పృథి
వీ వర! నాదగు భాగ్య మిట్లస
త్ప్రాయత చెందె. మీరును బ
దంపడి సత్యము గోచరించుఁ, బ్ర
జ్ఞాగుతు లౌ మహాత్ముల మ
నంబు లోకప్రవాహ తత్వ దారులఁ
బోయెడి చిత్తవృత్తివిధ
ముల్ మరలింపఁగఁ జాలెడింగదా! 30

అని వచియించి బాణకవి
యట్లె నిలంబడెఁ జక్రవర్తియుఁ
విని తెలిమి మేము నీదగు ప్ర
వృత్తిని గూర్చి యీవిధంబుగా
ననియెను గాని వేఱ పలు
కాడుట యాసన మిచ్చు టాదిగా
నొనరుపఁ డాయె నాతనికి
నొక్కటి యైన సమర్హసత్క్రియన్. 31

పరివారంబు తోలంగఁ బుచ్చి ధరఁడే
వాలాళి పీడ్కొల్పి ద

గ్గఱనే నిచ్చిన కృష్ణభూపతి కెదో
కర్ణంబునం జెప్పి, భూ
వరుఁ డా సత్కవి వంక స్నేహరస గ
ర్భంబుల్ కటాక్షావళుల్
పరఁగం జేయుచుఁ గొల్వుఁ వీడి చనె దృ
ష్య త్కాంజరంబో యనన్.

౭

నరపతి కొల్వుఁవీడిన క్ష
ణంబుననే కవివర్యుఁడున్ సభాం
తరగమితావమానము మ
నం బగలింపఁగ మాటిమాటికిన్
గురు పరితాపభారమున
కు న్గుటిలుండయి తనమిత్రవర్యు మం
దిరమున కేగె నైజ దుర
దృష్ట విశేష మిటుల్ తలంచుచున్.

అతుల పాండిత్య గరిమ కాహ్లాద మంది
యుచితసత్కృతు లొనరింప కున్న జేఁడు
ప్రియవచస్సుల నే నాదరింప లేదు
నాయభాగ్యము నేమి వర్ణన మొనర్తు.

మలినమనస్కు లౌచుఁ బలు
మాటలు నాదగు బాల్యకాలచా

పలమునుగూర్చి దుర్జనులు
పల్కిన మాటల, నట్టివానికిన్
ఫలితము లైన లోకులప
వాదములన్ విని నాపయి న్నృపుం
డలిగె ననుగ్రహం బొకదవు
నా ? యిఁక దర్శన మాచరించినన్. 3

హృది విపరీతభావము వ
హించుట నాపయి లేఁ డనుగ్రహా
భ్యుదయము చూపకున్నఁ గొలు
వున్నెడునప్పుడు స్నిగ్ధమూర్తియై
పొదిగొలిపెన్ ప్రసాదపరి
పూర్ణవిలోకన మాలికల్ పదిం
బది నదె చీఁకటి న్దివియ
భంగి నొకించుక యాశ గ్గొల్పెడిన్. 4

కలలో నూతనహంసముం దొలుత ధి
క్కారించినన్ బిమ్మటన్
గలహంసప్రభుఁ డాదరించి నటులే
కాలక్రమానన్ మదు
జ్జ్వలధీసంపద సత్ప్రవర్తనము రా
జశ్రేష్ఠుఁ డాలించి నన్
బిలిపింపంగఁ దలంచు నేమొ యని యా
వేదించు లోనెద్దియో.

గుణవంతుండగు రాజచంద్రుఁ డనుర
క్తుం డౌటకు న్మాయము దు
ర్వినయంబుం గలపోసి నాదెస క్రుధా
వేశంబు గైకొంట మ
ద్ఘనదౌర్భాగ్యము కాదె! యాతఁడిఁక యా
థార్థ్యంబు గుర్తించి నా
యనఘత్వంబును మెచ్చి కొల్వునకు నా
హ్వానింప వర్తించెడిన్.

కాల మేఁగు కొలంది భూపాలవరున
కమల మద్వర్తనము తెలియంగ వచ్చుఁ
గాని నిజదోషజనితావమానభరిత
మైన నాజన్మ మఖిల నిందార్హయుక్తి కాదె!
అని చింతించుచుఁ బండితోత్తముఁడు మిం
త్రాగారమ్ముం జేర వ
చ్చిన యా కాలము నందె కృష్ణధరణీ
శీత్వర్యుఁడున్ దూతతోఁ
జనుదే నయ్యెడ శేఖ దెంచి వినయాం
చనస్త్రీలియై భక్తి వం
దనముం జేసి కవిప్రకాండునకె వి
జ్ఞాపించె నీ రీతిగన్.

అనఁగు నెచ్చెలి! కవిసమూ జాగ్రగణ్య!
నేను వ్రాసిన లేఖ మన్నించి యారు

అరుగుదెంచిన దొరకు సముచితంబు మెచ్చియు
నస్మద్భక్తిద్వయము చరితార్థమయ్యెన్. 9

కొలువున సార్వభౌముఁ డను
కూలవచస్సులు పల్కి సత్కృతుల్
సలుపఁ డటంచు వేఁడుగఁ డ
లంపటుఁ డాస్త్ర, ఘనసన్మతిప్రభా
విలసిత వర్తనమ్ములను
వీనుల విందుగ నాలకించి భూ
తలపతి మీఁదెసన్ దన కృ
తంబునకుం బరితాప మొందెడిన్. 10

నరపతిఁ గూర్చి మోలగము
నం దను పల్కిన యర్థవద్వచః
శరములు తన్మనస్తలము
సంస్కృతముం బొనరించి సత్కృపాం
కురములు పాదుకొల్పెఁ గవి
కుంజర ! యూరసి యుంటి రేకదా
యరిగెడు వేళ మీావలన
నాతఁ డడర్చిన నెయ్యపుం దృశల్. 11

పాలసు లెవ్వరో కలుష
భావముచేఁ బురికొల్ప ఱేఁడు తా
త్కాలికమైన కోపము క
తంబున మిమ్ము నిరాకరించుటం

జాల విషణ్ణుఁడై నుడువఁ
జాలని భక్తిమెయిఁ బహుళక్షమా
శాలిత మీరు దర్శన మొ
సంగఁగఁ గోరెడి మన్ముఖంబునన్.

బలవత్తరమగు కారణ
మలవడినం గాని కలఁగ రాత్మవివేకుల్
కలఁగిన వెనువెంటనె ని
ర్గళిత వికృతులగుచుఁ బ్రకృతిఁ గాంచెదరు గదా.

జనపతి యోలగమ్మున వి
శాంపతులుఁ బరివారకుల్ సుధీ
జనములు నాకింపఁ బరు
షంబులు పల్కి నటంచు నాగ్రహం

బెనయక తప్పిసన్నత, య
హీనవివేకము, నీవి పెంపు, మ
త్ప్రణయము నెంచి రేపకడ
రావలెఁ గొల్వునకు న్సుధీమణీ!

అనుచు విన్నవించి యనఘుఁడౌ కవిచంద్రు
నాననంబునందు నాదరంపు
గుఱుతు లరసి కృష్ణ నరపాలుఁ డాత్మగే
హమున కరిగె సతని యనుమతి గొని.

కొలువున కేగు దెంచి తన
కుం గయి మోడ్చిన నూత్నహాంసముం

దొలుఁదొలుత న్నిరాదృతిఁ గ
నుంగొని యన్వాల భూరిసౌహార్ద్రదా
కలిత మనస్కుఁడై పరమ
గౌరవ భాజనుఁగా నొనర్చు హం
సల యెకిమీని చేష్ట కవి
మానస వీధి స్ఫురించె నయ్యెడన్. 16

తనమహాపాండిత్య వనరాశిలో నృపుం
డానందమున నోల లాడినట్లు
తనమనోహర కవిత్వవసంత వనములో
జేఁ డుత్సుకత విహరించినట్లు
తనమంజులప్రియ ఫణితిమాధ్వీరసం,
బవనీశ్వరుం డర్థి నాని నట్లు
తన గాథమైత్రీ సు ధాలేపనంబుచే
నొడయుండు సైమఱ పొందనట్లు
విస్మితుండై నటులు, రస వివశచిత్తుఁ
డై నటులు, ప్రీతి నిర్భరుఁడై నయట్లు
గౌరవించిన యట్టులా కవివతంసుఁ
డా రజని నిద్ర స్వప్నమ్ము నందుఁగాంచె. 17

తొలిమల నెత్తముపైఁ ద
మ్ముల చెలి యలరారె ఱేఁడు పుత్తెంచినయే
న్గుల జేనిపైని కవి రా
జలరె న్మఱునాఁడు ప్రాత రారంభమునన్. 18

మంగళ వాద్యనాదము ల
మందముగాఁ జెలఁగం గవీంద్రు ను
త్తుంగ గజంబుపై మహాము
తోఁ బుర మేగఁగఁ జేసి భక్తిన
మ్రాంగులు పౌరజానపదు
లారతు లెత్తఁగ మంత్రి భూమి భృ
త్పుంగవు లోలగంబునకుఁ
దోడ్కొని వచ్చిరి వైభవంబునన్.

నరపతులు పండితులు వెంట నరుగుదేర
ప్రభువు కవిపతి కెదురేగి భక్తి నెఱఁగి
యిభముపై నుండి కేలూఁత యిచ్చి దింపి
యతని సింహాసనము చెంత కానయించె.

కొలువునున్న పండితుల
గుండెలు దల్లలమందఁ గృష్ణభూ
తలపతి మోముఁదామర ని
తాంతవికాసము చెంద, సభ్యుల
గ్గలిక వహింప సత్కవి శి
ఖామణి సింగపుఁ బీఠి చెంత రం
జిలు సరి గద్దిపై నధివ
సించె నృపాలుని వేఁడికోలునన్.

ఉన్నత వేదికాంతరమ
హోన్నత పీఠతలంబునందుఁ గూ
ర్చున్న కవీంద్ర ధారుణీ వ
రుల్ విలసిల్లిరి కాంతిసంపద

భ్యున్నతిఁ జేసి యింద్రహరి
దుర్విధరాగ్రముసందు నొక్కటం
గ్రొన్నెలి పేర్మిఁ బొడిచి
కొల్కాను చంద్ర దినేంద్రులో యనన్. 22

ఆదినమే మొదల్ కవియు
హర్ష మహీరమణుండు నేకతా
పాదిత చిత్తులై విహిత
భావవిశేషముతోడ వర్తిలన్
భూ దివిజాధి నాయకుఁడు
పోరుల, వేఁటల, నోలగంబునన్
గాదిలి పండితుండు వెలి
గాఁ గనిపింపఁడ నాఁటినుండియుణ్. 23

అధికసఖ్యంబు కతన న న్యోన్య మెపుడు
తలఁచుచుంట భ్రమరకీట ధర్మ మొప్ప
సార్వభౌముఁడు సత్కవిచంద్రుఁడయ్యె
బాణకవి చంద్రుఁడును సార్వభౌముఁడయ్యె. 24

గౌరీ కాంతాప్రియు వి
స్తారోదార్యాబ్ధి ననుజ తనుజ సుహృ
ద్వారయుతుఁ బేర రాజును
గౌరీకాంతుండు బ్రోచుఁ గావుత మెపుడున్. 25

స్వస్తి.

మాస్టర్ మన్ ముద్రాశాల, కాకినాడ.